Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ నవంబరు నెల 27 వ తేది శుక్రవారం [నె 47 రు.



ఈజిప్టు యుద్ధములో పట్టుబడిన శత్రుసైనికులగు ఖైదీల కొందటి జట్టు.

## రణభేరి! శత్రుమారణభేరి!

### ఈ వారంలో యుద్ధ శుభవార్తలు

గడచిన వారం అంతా మన మిత్రసేనలు ఎక్కడకు వెళ్లినా విజయమే సాధిస్తున్నాయి. పట్టింది బంగారంగాను ముట్టింది ముత్యంగానూ ఉన్నది. ఏ రణరంగంనుంచి వచ్చిన వార్తలు చూచినప్పటికీ శుభవార్తలే వస్తున్నాయి. గడచిన వారం అంతా ఏ రోజు వార్తలు చూచినప్పటికీ మంగళకరంగానే కన్పించింది. తథాస్తు! ప్రజా స్వాతంత్ర్య రాజ్యాలన్నీ కోరేదికూడా అంతే. మిత్రసేనలకు జయవిజయీభవ! దిగ్విజయీభవ! గడచిన వారమంతా విజయభేరీమ్రోగుతోంది! దశదిశల మారుమ్రోగుతోంది!

#### లిబియా యుద్ధం.

అన్నింటికన్నా ముఖ్యంగా మున్ముందుగా చెప్పవలసినది ఏదంటే ఆఫ్రికాలో జరుగుచున్న యుద్ధం. క్రిందటివారం బ్రిటిష్‌వారి 8 వ సైన్యం బెంగాజీకి 70 మైళ్ల దూరంలో. ఉన్న ప్రదేశానికి చేరింది. ఇదిగో భద్రాద్రి, అదిగో భద్రాద్రి అన్నట్లుగా బెంగాజీకి బ్రిటిష్‌సేన అప్పటి కింకా సమీపిస్తోంది. గత శుక్రవారంనాటికి బెంగాజీకి బ్రిటిష్‌సేన చేరింది. నవంబరు 19 తేదీ రాత్రికే అనగా గురువారం రాత్రికే బెంగాజీనుంచి జర్మను సేనలు ఖాళీచేసి వెళ్లిపోయినాయి. బ్రిటిష్ సేనలు వస్తున్నవని నాజీ సేనలకు గురువారంనాటి రాత్రి తెలిసింది. నాజీ మదగజములకు బ్రిటిష్‌సింహం ఆనాటిరాత్రి స్వప్నంలో కన్పించగానే, ఇక బెంగాజీలో ఉంటే ప్రాణాలు దక్కవని నాజీలు బెంగపెట్టుకొని, దిగులుపడి పరుగులెత్తి పారిపోయినారు. అదివరకు త్రోవలో ఎల్‌ఆగెల్లావద్ద

కొంచెం బ్రిటిష్‌సేనను అడ్డగించుటకు జర్మను సేన మకాముచేసింది. కాని బ్రిటిష్‌సేన రాగానే జర్మను సేన చెల్లాచెదరుగా పారిపోయింది. అక్కడ 500 జర్మను టాంకులు యుద్ధసన్నద్ధంగా తయారై ఉండెను. కాని, బ్రిటిష్‌సేన యొక్క ధాటీకి ఆగలేక పారిపోయినప్పుడు 500 జర్మను టాంకులలో 15 టాంకులు మాత్రమే తప్పించుకొని పారిపోగల్గినవి. మిగిలిన జర్మను టాంకులన్నీ అక్కడ దారిలో యుద్ధరంగంలోనే చెల్లాచెదరుగా పటాపంచలుగా విడిచిపెట్టి పారిపోయినారు. "ఎక్కడి దొంగ లక్కడే! పిల్లి వచ్చె ఎలుక హలాత్!" అన్నట్లయింది. ఈ జర్మను సైనికుల శౌర్య ప్రతాపములకు వాళ్ల రామెలు సేనాని ఎంత సంతోషించాడో! అంత వేగంగా జర్మను సేన పరుగెత్తినందుకు హిట్లరు ఎంత ఆనందించాడో! శరవేగంగా యుద్ధం నడిపించడంలో జర్మనులకు సాటి ఇంకెవ్వరూలేరని హిట్లరుకు చాలా గర్వం ఉన్నది. జర్మనుల సమరశరవేగం ఇప్పుడు బాగా తేటతెల్లమైనది. నాజీలు బాగా తెల్లమొగమువేసి, కళ్లు తేలవేసి, కాళ్లకు బుద్ధిచెప్పారు.

బ్రిటిష్‌సేన బెంగాజీ రేవును మరునాడు నిరాటంకంగా ఆక్రమించింది. అంతటితో బ్రిటిష్ సేన ఆగలేదు ఇంకా ఆఫ్రికా కోస్తావెంట పశ్చిమంగా ఆగీడాబియావరకు నడక సాగించింది. ఇంకా చురుకుగా బ్రిటిష్‌సేన ముందంజవేయవలెనని ప్రయత్నించింది. కాని అచట ఆఫ్రికా ఎడారులలో గాలి దుమారాలు యీమధ్య ఎక్కువైనాయి. గాలి వానలుకూడా పెద్ద ఆటంకములుగా ఉన్నాయి. అందువల్ల సైన్యానికి ముందుగా మిత్రవిమానాలు ఎగురుతూ ఉండుటకు అవకాశం కలుగలేదు. అయినప్పటికీ చెక్కుచెదరని ఉక్కుముక్కలవలె ఆ బ్రిటిష్‌సేనలోనున్న మన భారతీయ ఘూర్కా పటాలములు మొక్కవోవని ధైర్యంతో దండయాత్ర సాగిస్తూనే ఉన్నాయి. మధ్యధరాసముద్రము వెంటనున్న లిబియా కోస్తాయావత్తూ మూడు ముప్పాతిక మువ్వీసం బ్రిటిష్ వారి కిప్పుడు వశమైనదని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పవచ్చు.

### ఉత్తరాఫ్రికా యుద్ధం.

అటు తూర్పునుంచి బ్రిటిష్ సేన పడమటి వైపునకు శత్రువును తరుముకొని వస్తూ ఉంటే, ఇటు పడమటినుంచి తూర్పుకు ఉత్తరాఫ్రికాలో అమెరికను సేనతో బ్రిటిష్ సేన చేరి శత్రువును తరుముకొని వస్తోంది. మొరాకాలోను, ఆల్జీరియాలోను అమెరికను సేనలు ప్రవేశించి, అచటి తమ పలుకుబడిని స్థిరపరచుకొన్నవి. అచటి నుండి బ్రిటిష్‌వారి ఒకటవ సైన్యం ట్యూనీసియాలో ప్రవేశించింది. ఈ ఒకటవ బ్రిటిష్ సైన్యానికి జనరలు ఆండర్సను సేనానాయకుడు. ఇతడు తన సేనతో టూనీసియాను ఆక్రమిస్తే, అటు లిబియాలోనుంచి వచ్చేటటువంటి బ్రిటిష్‌వారి 8 వ సైన్యంతో వెళ్లి కలిసికోవచ్చును. బ్రిటిష్‌వారి 8 వ సైన్యానికి జనరలు మాంటుగామెరీ సేనానాయకుడు. ప్రస్తుతం మాంటుగామెరీయొక్క బ్రిటిష్ సైన్యానికిన్ని ఆండర్సనుగారి బ్రిటిష్ సైన్యానికిన్ని మధ్య 400 మైళ్ల దూరం ఉంది. బ్రిటిష్‌వారి 1 వ సైన్యమున్నూ 8 వ సైన్యమున్నూ కలిస్తే, మధ్యనున్న జర్మను సేన తుత్తునియలై ధ్వంసమై ఆరుమూడవుతుంది. బ్రిటిష్ సేన ఒకటీ ఎనిమిదీ కలిసినా, జర్మనుసేన ఆరుమూడు అయినా మొత్తంమీద పర్యవసానం ఒక్కటే. బ్రిటిష్‌వారి కిది నవ.విజయం అని చెప్పకతప్పదు.

ట్యూనిస్ ప్రక్కనుంచి మిత్రసేనలు దాటి ముందుకు గత శుక్రవారంనాడే సాగివెళ్లినవి. బిజార్టానుంచి ట్యూనిస్‌వరకు గల ప్రాంతమంతయు మిత్రసేనల వశమైనది. జర్మనులు మాత్రము ట్యూనీసియాలో పట్టుదలగా పోరాడవలెనని చాలా టాంకులను బిజార్టాలో దింపుతున్నారు. లిబియాలో ట్రిపోలీకి దక్షిణంగా

[తరువాయి 4 వ పేజీలో]

### "శనివారం సిపాయీలు"

రంగూను ఫీల్డు బ్రిగేడు సైనికులకు "శనివారం సిపాయిల"ను పేరు వచ్చింది. శాంతి సమయంలో ఎవరి పనులను వారు చేసుకొంటు వారం ఆఖరు రోజున మాత్రం ఖాకీదుస్తులు తొడిగేవారు కనుక యీ పేరు. వారి సైనికదళం యిపుడు పునరుద్ధరింపబడింది. ఇండియా సముద్రతీరాలకు నౌకా దాడి రాకుండా కాపలా కాయుచున్న ఫిరంగి శిబిరాలందు వారిపుడు పనిచేస్తున్నారు.

# బ్రిటిషు దీవుల రక్షణ - భారతీయులు.

## విద్యార్థులు, స్త్రీలు, పురుషులు అందరు తోడ్పడుచున్నారు.

ఇండియానుండి తూర్పుదేశాలనుండి వచ్చిన స్త్రీలు, పురుషులును బ్రిటిషు దీవుల రక్షణయందు తోడ్పడుచున్నారు. కొందరు చాల ప్రధానకార్యములు చేస్తున్నారని ఆరబు వార్త తెలుపుచున్నది.

అనేకవందలమంది స్త్రీలు సివిలియనులుగ నుండియే సహాయం చేస్తున్నారు. కాని బ్రిటనులో నున్న సైన్యంలో చాలమంది తూర్పు దేశీయులు సైనికులుగ చేరియున్నారని చాలమందికి తెలియదు.

యుద్ధం ప్రారంభమయ్యే సరికి ఇంగ్లాండులో విద్యార్థులుగనుండిన యువకులకు విమానదళం ఆకర్షణీయంగా నుండెను. చాలమంది వైమానికులుగచేరి కీర్తిగడించిరి. 40 మంది రాయలు విమానదళంలో పెద్ద ఉద్యోగాలు సంపాదించిరి.

బ్రిటనులోనున్న భారతీయ పయనీరుకోరు చాల ఖ్యాతి గడించెను. విద్యార్థులు, నావికులు తదితరులు కాకీదుస్తులకు మోజుగలవారు, బ్రిటిషు సర్వీసురేటు జీతాలు పుచ్చుకొని, లండనుపై జర్మను విమానదాడి జరిగినపుడు సేవచేసిరి. పడిన గోడలు, ఇటుక కుప్పలు త్రవ్వితీయుటయందు అతి నేర్పు వడి చూపి సనాతన పద్ధతికి అలవాటుపడిన బ్రిటిషు పయనీరులకు ఆశ్చర్యం కలిగించిరి. బరువైన యంత్ర సామగ్రి మార్చవలసియుంటే, ఆపని వీరివల్లనే అవుతుందనే పేరు సంపాదించిరి.

ఇండియానుండి వచ్చిన డాక్టరులు చాలమంది ఆర్.ఎ.ఎం.సి. లో పనిచేస్తున్నారు. స్వదేశాలకు పోజాలకపోయిన విద్యార్థులు చాలమంది గవర్నమెంటు ఇంజనీరింగు తరగతులలో చేరి, యిపుడు వారానికి 7 పౌనులు మందుగుండు కర్మాగారాలలో సంపాదిస్తున్నారు. శాంతి సమయాలలో పేద విద్యార్థులకు ధనసహాయం చేయు సంస్థలు యిపుడు పనిలేకుండా ఉన్నాయి. వాటి సహాయం పొందేవారంతా యిపుడు పనులుచేసి గడించుకుంటున్నారు.

# సిపాయీలు - సివిలియనులు.

[సివిలు ప్రజలకు మిలిటరీ వారికిగల సంబంధం గూర్చి తెలుపు యీ దిగువ యుదంతమును సంతోషపూర్వకంగా ఉల్లేఖించుచున్నాము — యు. సం.సం]

"ప్రతి సిపాయి సివిలు ప్రజల ప్రాణాల రక్షించుటకు ప్రాణం తెగిస్తానని ప్రమాణం గైకొనును. ఇకముందు మీకు రక్ష సిపాయిలె" అని ఒక సీనియరు మిలిటరీ ఉద్యోగి యీ రాష్ట్రంతో జరిగిన సివిలియను-సిపాయి సమిష్టి విందులో పలికెను. యుద్ధంలోకి పోయిన సిపాయిలకన్న సివిలు ప్రజలకే అనేక విధాల ఎక్కువ కష్టాలుంటాయని కూడ అతను చెప్పెను. ఒకరిని గూర్చి యింకొకరికి బాగా తెలియకపోవుటచేత సిపాయిలకు ప్రజలకు అనేక అపోహాలు భిన్నాభిప్రాయాలు కలుగుతూ వుంటాయనెను.

ఈ రీతిగా సమిష్టి టీ పార్టీలు జరుపుతూవుంటే ఉభయులకు అన్యోన్యత సఖ్యత ఏర్పడుతుంది రాష్ట్రంలో వివిధచోట్ల జరుగుచున్న యీ సమిష్టి విందులు ఆదరింపబడుచున్నాయి. తమ సేవ, తమ త్యాగం ప్రశంసింపబడుచున్నదని తెలిస్తే సిపాయీలు ఎక్కువ ఉత్సాహంతో ధైర్యంతో పనిచేస్తారు. సివిలు ప్రజలు సిపాయీలను బాగా అర్థం చేసుకోగలుస్తారు.

ఆతిధ్యమొసంగిన రావు బహదూరు పి. ఎస్. జి. రంగస్వామి నాయుడుగారు యీదిగువ మాటలలో ఆ కూటంలో అందరి అభిప్రాయాన్ని వ్యక్తపరచేరు :—"సైనికులు నిర్వహిస్తున్న బాధ్యతను ప్రజలు గుర్తించి, వారియడల సానుభూతి కలిగియుండాలి. సిపాయీలును ప్రజలను గౌరవించాలి. ఒండొరుల యడ గౌరవము స్నేహము పెంపొందినచో దేశానికి శ్రేయస్కరము; రక్షణ సులభమగును."

---

ఇంతవరకు ఆగ్జలరీ టెరిటోరియలు సర్వీసునందు తూర్పుదేశాల స్త్రీ ఒక్కర్తే చేరింది. కాని మంటలార్పు దళాలలోను, నర్సులుగను సౌకర్యాలు చేకూర్చే సంస్థలలోను ఎన్నోవందల మంది యున్నారు. వీరు లండను, లివర్పూలు నగరాల దాడిసమయంలో చాల మంచి సేవచేసిరి.

[2 వ పేజీ తరువాయి]
వెయ్యి మైళ్ల దూరంలో ఉన్న బాడ్ సరస్సువద్ద ఉన్న ప్రాంతంలో మిత్రసేనలు బయలుదేరి ఉత్తరంగా ట్రిపోలీకిపోయే దారిని ఎల్ఆగీలియా వద్ద అడ్డగించుటకు ప్రయత్నిస్తూ ఉన్నాయి.

ట్యూనీసియాలో జర్మనులు కొత్త సేనలను దింపుటకు దానికి సమీపంగా (ఇటలీకి దక్షిణంగా) ఉన్న సిసిలీ దీవిలో సిద్ధపరచి ఉంచారు. అచటి విమానాశ్రయాలనుండి ఆ జర్మను సేనలు విమానాలమీద బయలుదేరి ట్యూనీసియాలో దిగుతున్నారు. లిబియాలోని ట్రిపోలీలోకూడా దింపుచున్నారు. అందువల్ల సిసిలీలో ఉన్న ఆ శత్రు విమానాశ్రయాలను ధ్వంసంచేయుటకు బ్రిటిష్ విమానాలు దాడివెడలి ఆ విమానాశ్రయాలమీద బాంబులువేసి సర్వనాశనం చేసినవి. సిసిలీనుంచి శత్రు విమానాలు ఇక బయలుదేరడం అసలే వీలులేదు. వేవేగంగా విమానాలమీద సముద్రం లంఘించి శత్రుసేనలు ట్యూనిసియాలోకి లిబియాలోకి రావడం అసంభవం. ఆ గగనసీమలో అవి గగన కుసుమాలే ఇక. ఆ విధంగా కొత్త శత్రుసేనలు రాకుండా బందోబస్తుచేసి, బ్రిటిష్ సేనలు ట్యూనిస్‌మీదకు బిజర్టామీదకు దండెత్తుతున్నాయి. అచటి ఫ్రెంచి సేనలుకూడా బ్రిటిష్ సేనలతో కలిసి జర్మనులతో పోరాడుతున్నాయి. ఫ్రాన్సును హిట్లరు జయించినప్పటికీ ఫ్రెంచి వారిని జయించలేదనే విషయం ఇప్పుడైనా హిట్లరుకు బోధపడిందో లేదో! పరాసువీరులు పరాశ్రితులై ఉండగలరా? పరాజయము భరింపగలరా? పౌరుషరాసులు పరాసువీరులు - గేబిసుకు పడమరగా చాలామంది జర్మను సైనికులను యుద్ధ ఖైదీలుగా ఫ్రెంచి సైనికులు పట్టుకొన్నారు. ట్యూనిస్ యుద్ధం - బిజార్టా యుద్ధం ఇంకా సాగుతూ ఉన్నది. బ్రిటిష్‌వారికి ట్యూనీసియా కోస్తా వశమైతే, మధ్యధరాసముద్రమంతా మళ్లీ బ్రిటిష్ నావలకు రాజబాట అవుతుంది. సూయజు కాల్వ దాటి సూటిగా ఇండియాకు ప్రయాణం సాగుతుంది. రష్యాకు సులభంగా యుద్ధ సామగ్రి అపారంగా చేరుతుంది. అక్షరాజ్యాలకు అంత్యకాలం మూడుతుంది.

## రష్యా యుద్ధం.

రష్యాలో మంచుకాలం తీవ్రంగా ప్రారంభమైంది. ఆ మంచుకు నిలువ లేమంచు జర్మనులు తోకమడత పెట్టుతున్నారు. రష్యను సేనలు స్టాలినుగ్రాడుకు వాయవ్యంగాను దక్షిణంగాను విజృంభించినవి. 3 రోజులలో 50 మైళ్లు ముందుకు నడచినవి. డాన్ నదికి తూర్పుతీరమున ఉన్న కలాచి అనే పట్టణాన్ని రష్యనులు తిరిగి ఆక్రమించి విక్రమించారు. రష్యనులు యీ చలికాలం మూడు నెలలలోను త్రివిక్రమావతారం దాల్చి జర్మనులను పాతాళలోకంలోకి అణగద్రొక్కేటట్లుగా ఉన్నారు. రష్యనులు రష్యాలోని చలికి బాగా అలవాటుపడినవారు. రష్యనులంటే చలిచక్రవర్తులు. ఆ చలికి బలికావలసిన గతి జర్మను సేనకు పట్టింది. హిట్లరు బలం రష్యాకు బలి అవుతున్నది. చలిచక్రవర్తికి బలిచక్రవర్తిలాగున హిట్లరు బలం ఆహుతి అవుతున్నది. అక్కడ డాన్ నదివద్ద జరిగిన 3 రోజుల యుద్ధంలో 14 వేలమంది జర్మనులు మరణించారు. 13 వేలమంది జర్మనులు ఖైదీలుగా పట్టుపడినారు. స్టాలినుగ్రాడు నగరంలో పోరాటం సాగుతూనే ఉంది. జర్మనులు నీల్గుతూనే ఉన్నారు. నల్చికునకు ఆగ్నేయంగా జర్మను సేనలు ఎన్నిసార్లు దండెత్తి వచ్చినను వెనుకకు తరిమివేయబడుచున్నవి. గ్రాజినీ నూనె గనులకు పోయే త్రోవలో జర్మనులు ముందుకు చొచ్చుకొనిపోయిరి. కాని వారిని రష్యనులు నలువైపుల ముట్టడించి నాశనము చేసారు. పొగమంచు విపరీతంగా ఉండుటవల్ల విమానాలకు రష్యాలో దోవ కన్పించడం లేదు. అందువల్ల జర్మనులకు ముందుకుపోవడం సాధ్యం అగుటలేదు. ముందు దారి కన్పించక వెనుక దారి చూచుకుంటున్నారు. "ఏదీ గతి నాకు?" అని నాజీనాయకుడు కలవరిస్తున్నాడు.

## పసిఫిక్కు యుద్ధం.

సాలమను దీవులలో కూడా జపాను నావలు అధోగతి పాలైనాయి. మొత్తంమీద 28 జపాను నావలు నాశనమైనట్లుగా నికరమైన లెక్కలు తేలినాయి. 10 నావలు దెబ్బతిన్నాయి. శత్రువుకు మూడురోజుల నౌకా యుద్ధంలో మూడిన దురవస్థ ఇది. అన్నింటికన్న చిత్రమైన విషయమేమంటే 9 వేల టన్నుల అమెరికను డిస్ట్రాయరు నావ వెళ్లి 24 వేల టన్నుల జపాను క్రూయిజరును ధ్వంసంచేసింది. "ఎలుకలు తమ కలుగులోకి ఏనుగు నీడ్చెన్" అన్నట్లయింది. ఈ నౌకాయుద్ధంలో అమెరికావారివి

# ఇంగ్లాండులో వారేమిచేస్తున్నారు.

## ప్రతివారు యుద్ధ విజయానికి తోడ్పడుతున్నారు.

హిట్లరుని దూరంగావుంచిన విధం

అమెరికాలో న్యూయార్కు నగరంలోని లిబర్టీయను పత్రికలో యీ దిగువ వ్యాసం ప్రకటించబడింది :—

ఇంగ్లీషువారు ఇంగ్లాండులో యింతవరకు ఏమిచేసిరో యిపుడేమి చేస్తున్నారో చూద్దాం. వాళ్లంత నేర్పుగ తెలివిగా పని చేయకపోతే హిట్లరు యీ సరికి లండనులో ప్రవేశించియుండును. కనడాకు వచ్చి, అమెరికా సంయుక్త రాజ్యాలనుకూడ బెదిరించియుండును.

రెండేండ్లకుపైగా జర్మనీయొక్క కేంద్రీకరింపబడిన సైనిక శక్తి అంతా ఇంగ్లాండు తీరానికి 18 మైళ్ల దూరాన ఫ్రాంసులోనే యుందని జ్ఞాపకముంచుకొండి. ఇంగ్లాండులో ఆంగ్లేయులు చేసినట్లే, వారితోపాటు యుద్ధంలో భాగస్వాములుగానుండి, పోరాడుచున్న యితర దేశాలవారంతా చేయ్యాలి. చక్కెర లేక, పైర్లు దొరక్క, వంటచెరుకు కరవయి పడే యిబ్బందులో యిబ్బందులు కావు. యుద్ధం కొనసాగిన కొలది ఆంగ్లేయులు పడవలసిన కష్టాలన్ని మనం పడవలసియుండును.

**అందరు యుద్ధం పనులే.**

ఇంగ్లాండులో అందరు యుద్ధంలో గెలవడానికి సహాయపడే పనులే చేస్తూవుంటారు. ప్రతి ముగ్గురులో యిద్దరు, పురుషులేగాదు స్త్రీలు, బిడ్డలు సహా 14-65 సం॥ల మధ్యవయస్సువారు దేశరక్షణ దళములందో, సైన్యాలందో లేక యుద్ధ పరిశ్రమలలోనో పని చేస్తునేవుంటారు. ఆరోగ్యంగా దృఢంగానున్న 18 మొ—51 సం॥ మధ్య వయస్సుగల వారంతా సైనికులుగనో లేక యుద్ధాని కవసరమగు పరిశ్రమలోనో పనిచేసి తీరాలి.

70 లక్షల ఆంగ్ల స్త్రీలు పనులలో చేర్చుకొనబడిరి. 20-30 సం॥ల మధ్యనుండు పెండ్లికాని స్త్రీలు సైన్య నౌకా విమానదళములందు సహాయానికి ఖాకి దుస్తులు ధరించిపోయేరు. 55,00,000 మంది స్త్రీలు మందుగుండు కర్మాగారాలలో పనిచేస్తున్నారు. ఇంకా కొన్ని లక్షలమంది యిండ్ల పనులలో తీరిక చేసుకొని కొంతకాలం యుద్ధ పనులకు వినియోగిస్తున్నారు. నడవగలచిన ప్రతివారు విమానదాడులందు ఏదో పనిచేయుటకు

**దేశ రక్షణ**

శిక్షణపొంది ఉంటారు. పగలు తమ జీవనోపాధికి మిల్లులలోనో గనులలోను పనిచేసేవారంతా సివిలు డిఫెన్సులోను, హోము గార్డులుగను రాత్రులందు పనిచేస్తారు. ప్రతి ఐదు ఇండ్లలో ఒకటి బాంబులచే కూలిపోవటమో సగం చెడ్డమో జరిగింది. 44,000 పైగా సివిలు ప్రజలు విమాన దాడిలో చనిపోయేరు.

**రష్యాకు సహాయం.**

ఇంత చెమటోర్చి కష్టపడి, నెత్తురు ధారపోసి ఇంగ్లీషువారు ఏమి సాధించేరయ్యా అంటే, వినండి. నిరుడు ఇంగ్లాండుకి అమెరికానుండి 2,500 విమానాలు పోయినాయి. బ్రిటీషువారు తాము తయారుచేసినవి 9,781 యితర మిత్ర రాజ్యాలకు పంపిరి. అమెరికా 200 టాంకులు పంపితే, ఇంగ్లాండు 3,000 తయారుచేసిరి. ఇం

---

2 చిన్న క్రూయిజర్లున్ను, 7 డెస్ట్రాయర్లు మాత్రమే నష్టమైనాయి. గ్వాడాలుకెనాల్ దీవిలో అమెరికను సేన ముందుకు సాగింది. నిర్భయముగా ముందంజవేసి హెండార్సను విమానాశ్రయాన్ని ఆక్రమించింది. గ్వాడాలు కెనాల్‌లోనున్న 15 వేల జపాను సైన్యంలో 10 వేల సైన్యం యీవరకే నాశనమైంది.

న్యూగినీలో బూనా - గోనా - సానాందా అనే ప్రాంతాల మధ్య ఆస్ట్రేలియను సైన్యం జపాను సైన్యంతో పోరాడి శత్రుసైన్యాన్ని మూడువైపుల నుండి ముట్టడిస్తొంది. కొత్త జపాను సేనలను అక్కడ దింపవలెనని 4 అమెరికను డెస్ట్రాయరు నావలు న్యూగినీ దీవివద్దకువస్తే అమెరికను బాంబు విమానాలు ఎదురేగి వాటికి చక్కగా స్వాగతమిచ్చి ఒక జపాను డెస్ట్రాయరు నావపై బాంబులను వర్షించి సముద్ర జలంలో స్నానంచేయించాయి.

ఎక్కడ ఏ యుద్ధరంగంలో చూచినా, ఈ వారమంతా మనకు మంగళకర వారంగానే ఉంది. శత్రువులకు శనివారంగానే ఉన్నది.

గ్లీషువారి విమానాల ఉత్పత్తి గత 12 నెలలో రెండింత లయింది.

బ్రిటిషువారికి అన్నివస్తువులు కొలప్రకారం అధికారులిస్తారు. ఒక చెప్పుజోళ్ల జత రెండు మూడేండ్లు వాడుకోవాలి. ఎందుచేత ? తాము తయారుచేసిన జోళ్ల జతలు 40,00,000 రష్యాకు పంపించేరు గనుక. అమెరికానుండి ఒక విమానం ఇంగ్లాండు తెచ్చుకుంటే నాల్గు రష్యాకు పంపుతుంది. రష్యా సైన్యానికి గత 8 నెలలో 2,000 టాంకులను ఇంగ్లాండు పంపెను. పెర్షియను గల్ఫుద్వారా కాకససుకి సరకు పంపుటకై ఏర్పడిన రైలు మార్గంలో నడచుటకు 1,000 రైలు పెట్టెలనుకట్టి, ఇంగ్లీషు పనివారు 12 నెలలలో జరిగే పని 10 వారములలో ముగించేరు.

పెర్షియను గల్ఫు వొడ్డున బ్రిటిషువారో కర్మాగారం ఏర్పాటుచేసిరి. అందులో నెలకు 200 ట్రక్కులు

లాభాలు లేవు.

తయారవుతున్నాయి. వాటినిండా సామానులు సోవియటు రష్యాకు పోతున్నాయి. ఇదంతా కాక ఇంగ్లాండులో 20,00,000 సైన్యం ఎల్లప్పుడు తయారుగా నుంచుటేగాక, అజ్ఞాతవాసంలోనున్న ఫ్రాంసు, నార్వే, పోలండు, హాలెండు ప్రభుత్వాల సైన్యాలను నౌకా దళాలన్నింటిని ఇంగ్లాండు పోషించుచున్నది.

ఇంగ్లాండులో లాభాలు తినడం అన్నదిలేదు. వివాహితుడు 3,000 డాలర్లు రాబడి తెచ్చుకుంటే అందు 955 పన్నుల క్రింద కట్టును. 25,000 రాబడిలో 15,000 పన్నుగా యిచ్చేవాలి. అదనపు లాభాలు నూటికి నూరు ప్రభుత్వానికే చెందును. తలకు 318 డాలరులు యుద్ధ ఋణ పత్రాలు కొన్నారు. రష్యా యుద్ధనిధికి ఇంగ్లీషు వారు 1,50,00,000 డాలర్లు చందా యిచ్చిరి.

## వృద్ధుని కవాతు

92 సంవత్సరముల వృద్ధుడగు సిపాయి తిరిగి సిపాయి దుస్తులు ధరించి, 30 మైళ్ల ప్రయాణం చేసి, కవాతు చేసెను.

జమేదారు ఇస్మేలుఖాను ప్రాత మదరాసు సైన్యానికి చెందిన సిపాయి. 3 వ మదరాసు రెజిమెంటు ప్రారంభోత్సవానికి హాజరయ్యెను. ప్రారంభోత్సవం మదరాసు గవర్నరుగారు జరిపిరి. 15 సంవత్సరాలకు తిరిగి మదరాసు రెజిమెంటు పునరుద్ధారణ జరిగెను.

సైన్యంయొక్క బిగులు వినగానే, సేనానాయకుడి ఉత్తర్వులు వినగానే, తిరిగి యవ్వనం వచ్చినట్లు యీ వృద్ధుడగు ఇస్మేలుఖాను భావించెను. ఆనాడు జరిగిన ఆటలలోను, విందులలోను, అన్ని పనులలోను స్వయంగా పాల్గొనెను.

## మదరాసీలను మరచిపోలేదు.

స్వంతదేశం విడచి చాలదూరాన విదేశాలలో యుద్ధాలందు పాల్గొంటున్న మద్రాసీలను యిండ్లలోనున్న వారి స్వంతజనం మరచిపోలేదు.

మదరాసు రాష్ట్రవాసులగు సిపాయిలకు యిటీవల ఒక నెలలో పంపబడిన పార్సిలులో 92,500 బీడీలు, 25,000 అప్పడాలు, 200 వీశలు పైగా జీడిపప్పు, 25 డజనుల సీసాలలో ఊరగాయలు, నాల్గు పెట్టెల పుస్తకాలు, పత్రికలు, 220 గ్రామఫోను రికార్డులు పంపబడెను.

## సంశయాత్ముడుగా నుండుము !

తనకు నిజమని తెలిసేవరకు
దేనిని నమ్మనివాడు సంశయాత్ముడు.
వదంతుల విషయమున మీరు సంశయాత్ములు కండు.
మిమ్ము తప్పుదారి ద్రోయుటకు
అవి జపానులో సృష్టియగుచున్నవి.

✻ వదంతులు నమ్మకండి. ✻



జపానువారి ఎదుర్కొనుటకై దేశీయ యుద్ధరంగం తయారుచేయుడు.




అక్ష-రాజ్య నాయకులగు హిట్లరు ముసోలినీల సఖ్యత యీరీతిగా వుంది.

# యుద్ధ విమర్శ.

## కకోడా ఆక్రమణ—పశిఫికులో 142 జపాను యుద్ధ నావలు మునుగుట—

## అక్షరాజ్యాలకు యిరువైపుల ఓటమి.

విమానశక్తియే విజయానికి మూలం. ఈ విషయం మిత్రమండలివారు ముఖ్యంగా దక్షిణ పశిఫికు సముద్రంలో న్యూగినీ సాలమన్సు దీవుల యుద్ధరంగాలందు తెలుసుకొనిరి.

కకోడా ప్రాముఖ్యత

ఈ నెల ప్రారంభంలో మిత్రరాజ్యాలవారు న్యూగినీ దీవియందలి కకోడా రేవు స్థలమును వశపరచుకొనిరి. గుడలుకనాలు దీవియందు హెండర్సను విమానాశ్రయం అమెరికా వశం తప్పిపోలేదు. న్యూగినీలోని, కకోడా అను యుద్ధ వ్యూహానికి అవసరమగు ముఖ్య నగరం మూడు నెలలు జపానువారి వశము నందుండెను. జూలై 28 వ తేదీన వీరు ఆపురమును పట్టుకొన్న తరువాత 44 దినములలోగా న్యూగినీ దీవి దక్షిణభాగాని సైన్యాలను పంపి, ఆస్ట్రేలియా ఉత్తర కొసకు దగ్గరగనున్న పోర్టు మారస్బీకి 40 మైళ్ల దూరంవరకు వచ్చిరి. ఐమోరిచైవా వరకు త్రోసుకొనివచ్చిరి. కాని రెండు నెలల క్రిందట అనగా సెప్టంబరు ఆఖరు వారంలో సర్ తామసు బ్లేమీగారి సేనలు తిరుగు దాడి ప్రారంభించి కకోడా చేరినవి. జపాను వారు 44 రోజులలో చేసిన దాడి మిత్రరాజ్య సేనలు 35 రోజులలో చేసినవి.

కకోడా ఆక్రమణవలన పోర్టు మారస్బీకి ముప్పుతప్పినది. మిత్రరాజ్యాలకు క్రొత్త విమానాశ్రయం లభించింది. ఇక బునోగోనో ప్రాంతం నుండు జపానువారిని తరిమివేయుటకు యిది యెంతయో తోడ్పడును. ఈ ప్రాంతాన నానాటికి తగ్గిపోవుచున్న జపాను శిబిరాలపైకి మిత్రసేనలు క్రమేణ తరుముకొని వస్తున్నవనియు, జనరలు

మకార్థరుగారి సేనలు బునా నగరానికి ఒక మైలు దూరంలోనున్నవనియు మంగళవారం తెలియ వచ్చెను. ఇచట తీవ్రయుద్ధం జరుగుచున్నది. నిరోధం ఎక్కువగనేయున్నను మిత్రసేనలు త్రోసుకపోవుచునేయున్నవి. గోనో నగరం ఆదివారం అమెరికను సేనలవశమయింది.

జపానువారు యీ ఓటమికి చాల ఆందోళన పడుచు, తిరిగి ఎట్లయిన నష్టం కోలుకోవాలని చాల ప్రయత్నం చేస్తున్నారు. న్యూగినీలో '0' రకం విమానాలను ఎక్కువగ తెచ్చి పెట్టుచు, బునా నగరంలోకూడ విశేషంగా క్రొత్త సేన దింపుచున్నారు. కాని మిత్రవిమానాల దాడులవలన వారి యత్నాలు విఫలమవుతున్నాయి. జపానువారు యింకాయెక్కువ క్రొత్త సేనలను నౌకలపై తేకుండ వారించుటకై మిత్రరాజ్య సేనలు బూనాకు 200 మైళ్ల దూరంలోనున్న 'గుడుఇనఫ్' దీవిని ఆక్రమించినవి.

**142 జపాను నౌకలు మునుగుట.**

జపాను నౌకాదళంలో పెద్దభాగం సాలమన్సు ప్రాంతాలనుండి నాల్గు వారాల క్రిందట వెడలిపోయెను. జపానువారు తిరుగు దాడి ప్రారంభించి మొదటి రౌండులో విజయం ఖచితంగా తెలియకముందే, విరమించుటకు నౌకలను ఎక్కువగా నష్టపోవుటే కారణమయ్యుండును. అక్టోబరులో 369 శత్రు విమానాలు నైరుతి పశిఫికు రంగమున కూల్చబడినవి. నవంబరు 13-15 మధ్య మూడు రోజులలో సాలమన్సు నౌకా యుద్ధమునందు జపాను చాల నావలను గోల్పోయెను. జపానువారు గత డిశంబరు 7 వ తేదిన అమెరికావారి పెరల్ హార్బరు దీవిపై దాడిచేసిన లగాయత్తూ నవంబరు 16 వరకు మొత్త 142 జపాను పెద్ద యుద్ధనౌకలు మునుగుటో పూర్తిగ చెడుటో జరిగెనని అమెరికా అధికారులు ప్రకటించిరి.

ఈ నష్టాలగురించి అమెరికా నౌకాదళ మంత్రి కర్నలు నాక్సుగారు గత శుక్రవారం యిట్లా అన్నారు :—

> "ఇపుడా దీవిపై మన కథికారం చాల భద్రంగా నుంది—వారు ఎప్పుడైనా క్రొత్త సైనికబలం తేవచ్చును. కాని అందుకై వారు త్రోవంతా యుద్ధం చేసుకుంటూ రావాలి. ఇంతవరకూ వారాపని చేయలేకుండాయున్నారు."

**అక్ష రాజ్యాల కన్నివైపుల ఓటమి.**

ఉత్తరాఫ్రికాలో శత్రు రాజ్యాలు ఓడిపోయిన సమయమునందే, సాలమన్సు దీవులలో అమెరికను నౌకాదళ విజయంకూడా సంభవించుట శత్రు రాజ్యాలకు దిగులు కలుగజేస్తున్నది. జపానువారు ఒకసారికాదు, రెండు సారులుకాదు, మూడు సారులు అమెరికా నౌకాదళంచే ఓడింపబడిరి. విమానబల సహాయంతో జరిగిన పెక్కు నౌకా యుద్ధాలందు అమెరికనులదే పై చేయిగానుండెను.

> "కోరలు సముద్రమునందు, మిడ్వే దీవియందు యుద్ధాలు నౌకలపైన నివాసముండు విమానాలతో జరిగినవి కాని సాలమన్సు యుద్ధం పూర్తిగ రెండువైపుల వారి నిలకడగనుండు ఫిరంగులతో జరిగిన యుద్ధం. నౌకాశక్తికి ప్రధానం సైనిక దళాలేయని యీ యుద్ధం రుజువు చేసింది."

గుడలుకనాల్ దీవియందు అమెరికను సేనలు విమానాల సహాయంతో నెమ్మదిగ పడమరకు త్రోసుక పోవుచున్నవని అమెరికా నౌకాదళంవారి తాజా ప్రకటన దెలుపుచున్నది.

ఆఫ్రికా ప్రాంతములందు, దూర ప్రాచ్యమునందుగూడ అక్షరాజ్యాలకు ఓటమియే సంభవించినది. నైరుతి పశిఫికునందు తురుపు ముక్కల వంటి కకోడా (న్యూగినీ) హెండర్సను విమానాశ్రయం (గుడల్‌కనాల్) మిత్రరాజ్యాల చేతులోనేయున్నవి. వాటి నాక్రమించుటకు శత్రువు విశేష కృషిచేయును. కాని మిత్రసేనలు ఏమరియుండలేదు.

---

## బ్రిటిషు సోల్జరుల ప్రశంస.

ఒక టర్కిషు పత్రిక ప్రత్యేక విలేఖరి ఈజిప్టులో బ్రిటిషు సైనికుల యుద్ధంచూసి వారినిగూర్చి యిట్లు వ్రాసెను :—

ఈజిప్టులో నేచూచిన అద్భుత విషయాలన్నింటిలోను బ్రిటిషు సైనికులు యుద్ధంచేసే నేర్పు మిగుల ప్రశంసనీయమయినది సమయోచిత చర్యలకు స్వయంభూత్వమునకు బ్రిటిషు సైనికుడు పెట్టినపేరు. ఈ ఖ్యాతి బ్రిటిషు సైనికులకు ఎప్పుడూవుంది, కాని నేటి సైనికులు గడచిన తరంవారిని మించిపోయిరి. బ్రిటిషు సైనికాధికారులు తమ సైనికులను అయాచితంగా ప్రశంసిస్తారు. నాటకం కంపెనీలో అన్ని పార్టులకు సిద్ధంగానుండే నిపుణుడగు నటకుని వంటివాడు బ్రిటిషు సైనికుడు. ప్రతి సైనికుడు తనంతతాను ఆలోచించి నిర్వహించగల సమర్థత కలిగియుండాలనియే బ్రిటిషు సైనిక శిక్షణయందలి మూలసూత్రం.

# హరహరా! సహరా!

శత్రుసంహారం చేసేటప్పుడు సంగ్రామ రంగంలోకి దూకేటటువంటి భారతీయ సైనికులు "హరహరా!" అని గొంతెత్తి కేకవేసి కత్తి పైకి దూసేవారు. హిందూ రాజు సైన్యాలు పూర్వ కాలంలో "హరహరా" అంటే అమితమైన వీరావేశంవచ్చి పోరాడేవారు. అన్య రాజ్యాలను అపహరించవలెననే దురాశతో కయ్యమునకు కాలుదువ్వినవాళ్ల లోకకంటకులు. అటువంటి లోకకంటకులు భూలోకంలో ప్రబలినప్పుడు భూదేవి సహించలేదు. భూమికి భారమైన పాపాత్ములను సంహరించవలసినదని భగవంతుణ్ని భూదేవి ప్రార్థిస్తుంది. అప్పుడు భగవంతుడు రుద్రమూర్తి అవుతాడు. ఆ రుద్రుడే సమస్త భూవలయమునకు విలయమును కల్పిస్తాడు. రణరంగములను కల్పించి శత్రు మారణము చేస్తాడు. తన మూడో కన్ను తెరిచి మాడ్చివేస్తాడు. రుద్ర రూపమును దాల్చుటకు ముందు మౌనముద్ర వహించి ఘోరమైన తపస్సుచేస్తూ ఉంటాడు. అటువంటి సర్వలోక శత్రు సంహారకుడైన హరుని స్మరిస్తే పిరికి పందకుకూడా శౌర్యం వస్తుంది. ఆ నమ్మకంతో "హరహర మహాదేవ్"అనే రణవీరాలాపం ఆచరణలోకి వచ్చింది.

ఇప్పుడు జరిగే మహాసంగ్రామంలోకూడా భారతీయ సైన్యాలు దూర దేశాలలో పోరాడి దురాత్ములైన శత్రువులను సంహరిస్తున్నారు. మహారాష్ట్రి పటాలములు నేపాళమునుండి వెళ్లిన ఘూర్కా పటాలములు, రాజపుత్రస్థానమునుంచి వెళ్లిన రాజపుత్ర పటాలములు, సిక్కు పటాలములు నేడు ఆఫ్రికా ఖండంలో అఖండ విజయమును సాధిస్తున్నారు. ఇక్కడ యీ మధ్య ప్రాచ్యరంగంలో సాధింపబడే విజయంవల్లనే యీ మహాసంగ్రామంలో ఇంతవరకూ జరిగిన కథ యావత్తు అడ్డం తిరుగుచున్నది. శత్రుసేనలు ముందంజవేసిన కాలుపోయి, మిత్ర సేనలు ముందంజవేసి, కాలచక్రం గిర్రున వెనక్కి తిప్పుటకు పని జరుగుతున్నది.

ఈ మధ్యధరా సముద్రతీర ప్రాంతములో జరుగుతున్న యుద్ధమే మిత్రమండలి విజయమునకు ప్రధాన సాధనము. యావత్తు ప్రపంచమునకు యీ మధ్యధరా సముద్రరంగమే గర్భాలయంవంటిది. ప్రజా స్వాతంత్ర్య రాజ్యములను మొట్టమొదట ప్రపంచములో ప్రతిష్ఠంపబడినటువంటి గ్రీసు సామ్రాజ్యమున్నూ, రోమను సామ్రాజ్యమున్నూ యీ మధ్యధరా ప్రాంతంలో వర్ధిల్లిన రాజ్యములే. ప్రపంచంలోకెల్ల అత్యంత ప్రాచీనమైన మహా సామ్రాజ్యములు అనేకవేల ఏండ్లక్రిందట వర్ధిల్లిన ప్రాంతములన్నియు యీ మధ్యధరా సముద్రతీర రాజ్యములే. ప్రజా స్వాతంత్ర్య విజ్ఞానామృత కలశము ఉద్భవించిన జన్మస్థానము యీ మధ్యధరా సముద్ర ప్రాంతము. అక్కడనే తిరిగి ధర్మమునకు అధర్మమునకు సంఘర్షణ వచ్చింది. ధర్మ మథనము ప్రారంభమైనది. అక్షరాజ్యాల సేనలకు, మిత్రరాజ్యాల సేనలకు ఇక్కడ జరిగెడి యుద్ధము ధర్మప్రతిష్ఠాపనకు దారి చూపుచున్నది. బ్రిటిషు సేనలు, అమెరికాసేనలు, ఫ్రెంచి సేనలు భారతీయసేనలు, ఆస్ట్రేలియను సేనలు, ఆఫ్రికా సేనలు యివన్నియు ఏకమై ఒక్క మిత్రపక్షమున ఇచట సమావేశమై శత్రు సంహారం చేయుచున్నవి. జర్మను సేనలు, ఇటలీ సేనలు కలిసి పోరాటమును ప్రారంభించినవి. కాని ఇటలీ సేనలను విడిచిపెట్టి జర్మను సేనలు పారిపోయినవి. అక్షసేనల అయికమత్యం అందులోనే బయటపడింది.

అటు ఉత్తరమున యూరోపు ఖండం, ఇటు దక్షిణమున ఆఫ్రికా ఖడం. ఈ రెండు ఖండములకు మధ్యనున్నది మధ్యధరా సముద్రం. ఈ మధ్యధరా సముద్రానికి పశ్చిమ ద్వారముగా జిబ్రాల్టరు జలసంధి వున్నది. తూర్పు ద్వారముగా సూయజు కాల్వ వున్నది. రెండున్నూ మిత్రమండలి వశమందే వున్నవి. అట్లాంటిక్కు మహాసముద్రంలోనుంచి జిబ్రాల్టరుద్వారా మధ్యధరా సముద్రంలోకి రావచ్చు. మధ్యధరా సముద్రంలోనుంచి సూయజు కాల్వ ద్వారా హిందూ మహా సముద్రంలోనికిన్ని, పశిఫిక్కు మహా సముద్రానికిన్నీ పోవచ్చు. అమెరికా నావలు అట్లాంటిక్కు మహాసముద్రం దాటి జిబ్రాల్టరుకు వస్తాయి. మధ్యధరా సముద్రందాటి ఆసియా ఖండానికి పోతాయి. అమెరికా ఖండంనుంచి ఉత్తరాఫ్రికాకు దగ్గర, ఉత్తరాఫ్రికానుంచి యూ

రోపు ఖండం దగ్గర, ఉత్తరాఫ్రికానుంచి ఆసియా ఖండం దగ్గర, అటు పడమట అమెరికా ఖండానికి, ఇటు తూర్పున ఆసియా ఖండానికీ మధ్యలోవున్నది మధ్యధరాసముద్రం. అటు ఉత్తరమున యూరోపు ఖండానికి, ఇటు దక్షిణమున ఆఫ్రికా ఖండానికి మధ్యలోవున్నది మధ్యధరాసముద్రం. యావత్తు ప్రపంచానికీ ఇది నడిబొడ్డువంటిది. ఈ నాభి ప్రదేశంవద్ద కొట్టితే ప్రజాస్వాతంత్ర్య భూసుతాపహరణము చేసే అక్షరాక్షసులను సంహరించడం సులభ సాధ్యం.

ఆఫ్రికా ఖండంలో అందుకనే మిత్రసేనలు యీ విజయలక్ష్మీ వ్రతానికి విఘ్నేశ్వర పూజను ప్రారంభించినవి. ఆఫ్రికా ఖండంలోకి జర్మను సేనలు దిగవలెనంటే ఉత్తరమునుంచి దక్షిణమునకు మధ్యధరాసముద్రందాటి రావాలి. జర్మనుల కది ప్రాణగండం పరమ సాహసకార్యం. సాహసంచేసి వచ్చినప్పటికీ ఇక్కడ ఉత్తరాఫ్రికాలో ఉన్నదంతా బ్రహ్మాండమైన సహరా ఎడారి. కొన్నిచోట్ల త్రాగడానికి నీళ్లు ఎన్ని మైళ్లు తిరిగినా దొరకవు. అది ఒక ఇసుక సముద్రం, ఎండ చూస్తే గుండె పగులుతుంది. ఎండ మావులు చూచి ఎక్కడో నీళ్లు వున్నాయని భ్రమించి పరుగెత్తెడి మృగాలవలె ఆ ఎడారిలోకి దిగిన శత్రుసేనలు తోక ముడతపెట్టి పరుగెత్తుతున్నవి. వాటిని వెంటాడి వేటాడి తరుముచున్న బ్రిటిషుసేన "హరహర మహదేవ్" అని శత్రుమారణం చేస్తోంది. సహరా ఎడారిఅంటే ఏమిటో ఎన్నడైనా జర్మను లెరుగుదురా? సహరాకంటె బ్రహ్మాండమైన ఎడారి భూలోకంలోలేదు. "ఏనాడు నడచినా - మీ ఎడారులలోన?" అన్నట్లుగా తమ రాజ్యం విడిచి తమ స్వజనం విడిచి, తమ అయిరోపాఖండం విడిచి, సహరా ఎడారికి దయచేసిన జర్మనులకు దుర్మరణయోగంకూడా ప్రాప్తించింది. ఇక్కడ సహరా ఎడారిలో సంహారమవుతున్నారు. "అరి వీరసంహారి - ఆఫ్రికా ఎడారీ" అనే విషయం గ్రహిస్తే, జర్మనుల రాజ్యదాహం యీ ఎడారిలో ఏవిధంగా తీరగలదో బోధపడుతుంది. మన ఘూర్కా సేనలు, మహారాష్ట్ర సేనలు, రాజపుత్ర సేనలు అరి వీరులను గురిచూచి గుండె లదరునట్లుగా కొట్టి సహరా ఎడారిలో రౌద్రమంతా చూపిస్తున్నాయి. "హరహరా!" శబ్దం సహరాలో వినిపిస్తోంది. శత్రువులను గడ్డి తినిపిస్తోంది - బ్రిటిష్ సింహం గర్జిస్తోంది - నాజీ మదగజాలు పారిపోతున్నాయి. ఆఫ్రికా సింహనాదం అక్షరాజ్యాలకు విన్పిస్తోంది. అన్ని దేశాలకు ప్రతిధ్వనిస్తోంది. అసురహరా! మధ్యధరాసమరధర సహారావిహారా! శుభకరా! హరహరా! అని సహరాలో సమరవిహారం చేస్తూ రణదుందుభిని పూరిస్తున్నాయి భారతీయసైన్యాలు. హరహరా! సహరా! సాగుతోందిసమరం.

## శత్రుప్రచారం అసత్యమని రుజువగుట.

బ్రిటిషువారు తరుచుగా భారతీయ సేనలను ముందునిలిపి యుద్ధం చేయించుచు ఇంగ్లీషు సేనలను వెనుక నుంచుతారని సూచించుచూ ఎన్నోసార్లు శత్రువులు ప్రచారం చేస్తూవుంటారు. ఆఫ్రికా ఎడారి యుద్ధంలో చనిపోయి దెబ్బతిన్నవారి సంఖ్యలు యీ అసత్యాన్ని వెల్లడిచేసినవి. 1941 నవంబరునుండి 1942 జూలైవరకు సైనిక నష్టాల సంఖ్యలు అధికారరీత్యా ప్రకటించపబడినవి యిట్లు గలవు:—

| | |
|---|---|
| ఇంగ్లాండు సైనికులు నూటికి 50 వంతు. | భారతీయ సైనికులు నూటికి 20 వంతు. |
| దక్షిణాఫ్రికా సైనికులు నూటికి 25 వంతు | మిగిలినవారు నూటికి 5 వంతు. |

ప్రస్తుత ఆఫ్రికా యుద్ధంలో ఇంగ్లాండు సైనికుల నష్టం అదివరకు సంఖ్యకన్న 9% ఎక్కువ. కావున భారతీయుల సంఖ్య యిదివరకుకన్న తక్కువగ నుండవచ్చును.

అక్షరాజ్య ప్రచారం యిట్లుండగా ఈజిప్టు యుద్ధరంగంలో ఇటలీ సైనికులను విడచి జర్మనులు ముందు పారిపోతున్నారనే వార్తలు వింటున్నాము - సిగ్గులేని ప్రచారం!

# జనరలు మాంటిగొమరీ విజయ రహస్యం.

●

ఈజిప్టు యుద్ధంలో బ్రిటిషు సేనానాయకుడగు జనరలు మాంటుగొమరీగారు జయముపొందుటకు ప్రత్యేక రహశ్యంగలదు. క్రొత్తరకం ఆయుధాలను క్రొత్త పద్ధతిని వారు ఉపయోగించిరి. నెలల తరబడి దిట్టపరచుకొన్న ఆఫ్రికను శత్రుదళముల శిబిరాలను సూటిగ ఎదిరించి మాంటిగొమరీ విజయం పొందెను. అట్టి శిబిరాలను ఒక్కసారి ఛేదించినచో రక్షించుకొనుచున్నవారు తిరిగి కోలుకొనజాలరని వారికి తెలుసు. కావున పైన విమానాల సహాయంతో ముందుగ కాల్బలమును, ఫిరంగి దళములను ఒక్క ఉమ్మడిని శత్రువులపైకి పంపి తరువాత టాంకు దళములను పంపి మాంటుగొమరీగారు రోమెలు సేనలను అతి దూరానికి తరిమివేయగల్గిరి.

లిబియా ఎడారిలో శత్రు సేనలను చాల దూరానికి తరిమివేసినానక యింకను మిగిలియున్న కొద్ది మందినికూడ వశపరచుకొనుట సులభమయ్యెను. 5 డివిజనుల ఇటలీ సేన పారిపోవుటకు ఎటువంటి సదుపాయాలులేక జర్మనులచే విడువబడెను. వేలకొలది ఇటలీ సైనికులు ఎడారిలో ఖైదీలుగా పట్టుబడిరి. బ్రిటిషు సైనికులు వారిని ఖయిదీలుగా పట్టుకోకపోతే వారు తిండిలేక చచ్చియుందురు.

ఈ విజయంవలన మూడు విషయాలు బయల్పడినవి. మిత్రమండలి విమానదళములు నిరాఘాటమయిన అధికారంగల్గి శత్రువులు విడచిన విమానాశ్రయములను ఆక్రమించుటచే పారిపోతున్న శత్రువును ఎంతదూరమయిన తరుమగలవు. అనేక రేవులను తిరిగి ఆక్రమించినందున సముద్రమార్గములను ఉపయోగించుకోవచ్చును. రోమెలు మోటారు లారీలన్ని మిత్రమండలి విమానాలవల్ల ధ్వంసం చేయబడుటచేతను, గత నెలలో శత్రు చమురునావలు ఉత్తరాఫ్రికాతీరం చేరకుండుటచేతను రోమెలుకు చమురు చాలకపోయి యుండును. అందుచే అతని సేనలు ఎదురు తిరగలేక టూనిషియావరకు పారిపోయినవి.

# రాధ కధ.

●

చిన్న రాధ పాపం బ్రతికియుండును, కాని యితరుల పాపకృత్యంవల్ల చనిపోయింది. నది ఒడ్డున ఆమె శవాన్ని దహనం చేస్తువుంటే చూసినపుడు నా కట్లనిపించింది.

శ్రీకృష్ణుడు విహరించిన మధురా నగరానికి ఎనిమిది మైళ్ల దూరంలో రాయ అను గ్రామంలో రాధ ఎనిమిదేళ్ల క్రిందట పుట్టింది. ఏడాది పిల్లపుడే పాపం తల్లి చచ్చిపోయింది. రాధ పుట్టినప్పటినుండి తండ్రి పంటలు బాగా వృద్ధిపొంది అప్పులు తీరేయి. కనుక తండ్రి చౌదరి రఘువీర దయాళ రాధను అతిగారాబంగా పెంచుచుండెను. అతను గ్రామ మునసబు. గ్రామం అందరు ఆమెను ముద్దుగా చూస్తువుండేవారు. చేరడేసి కాటుక కండ్లు, ఎర్రకబ్బ, పచ్చపరికిణీతో ఆమె కృష్ణునిపై పాటలు పాడుకొనుచు వూరులో తిరుగుతువుంటే అందరికి ముచ్చటగనుండెను.

మూడు రోజుల క్రిందట చిన్ని రాధకు జ్వరం వచ్చిందని వూరంతా తెలిసింది. మంచంపై ఆమె కాళ్లు ముడుచుకొని పడుకుంది. తండ్రి ప్రక్కన దిగులుతో కూర్చొనియున్నాడు. పొరుగు వారబ్బాయి రాముని మధురకు డాక్టరుని తెమ్మని పంపెను. అతనికొరకు ఎదురు చూస్తుండగ త్వరలోనే వచ్చెను. కాని డాక్టరు రాలేదు. ఏమంటే మధుర పోవుటకు రైలు లేదనెను. ఏమిరా అంటే, ఎవరో రైలు పట్టాలు తొలగించేరని చెప్పెను. అందుచే ఎద్దు బండి కట్టుకొని రాము పోయెను. తెల్లవారుసరికి తిరిగి బండివచ్చెను. కాని బండిలోనుండి దిగిన రాముడు ఏడుపుమొగంతో యింక లాభం లేదనెను. నాలుగో మైలువద్ద గూండా లడ్డగించి బండిని పోనివ్వలేదట. టెలిగ్రాఫ్ తీగలు, స్థంభాలుకూడ తీసివేసేరని చెప్పెను. రాము డెందుకని అడిగితే, "నీవు పల్లెటూరివాడివి, నీకేమి తెలియదు పో" అన్నారట. ఎందుకు రైలుపట్టాను లాగేరో, ఎద్దు బండిని పోనివ్వలేదో రాముడికి నిజంగా తెలియదు.

ఇంతలో రాధ ప్రాణం పోతున్నది. గ్రామంలో వైద్యుడేవచ్చి నాడి లాగేస్తున్నది బ్రతకడం

కష్టమనేను. రఘుబీర దయాలు రాతివిగ్రహం వలె నోటమాటలేక కూర్చుండెను. గ్రామస్థులు కొందరు చుట్టు నిలచిరి. అప్పుడే వానకురిసి వెలిసింది. మంచి ఎండ, మట్టివాసనతో గాలి వీచుచుండెను.

రాధ కళ్లు ఓమారు తెరిచింది బ్రతుకుం దేమో అని కొందరికి- ఆశ కలిగింది. కాని రెండు వెక్కిళ్లతో ప్రాణం పోయింది. పాపం! రైలునడచి మధురనుండి డాక్టరు వచ్చియుంటే రాధ బ్రతికియుండునని, గ్రామస్తులంతా అనుకున్నారు. రైలుపట్టాలు లాగేసిన వారిని తిట్టేరు.

---

## బర్మాలో లూటీలు.

●

బర్మాను జపానువారు ఆక్రమించిన తరువాత తిండిలేక రయితులే బ్రతుకుటకై దోపిడిచేయవలసివస్తున్నది. రంగూను - ప్రోము రోడుపైనున్న తారావడిపురమును రయితు దొంగలు దోపిడిచేసిరి. పెక్కు యితర జిల్లాలలో యీ దోపిడిగాండ్రకు భయపడి భారతీయులు, బర్మనులు, భూస్వాములు కొండలలోనికి పారిపోతున్నారు. బర్మాలో రయితుల యిక్కట్టులన్నింటికి భూస్వాములే కారకులని జపాను ప్రచారం సాగించింది.

ప్రజలను రక్షించవలసిన పోలీసుదళం చాలదు, పైగా ఉన్న పోలీసులలో నీతిలేదు.

### మిత్రసేనలకు ఆహ్వానం.

బర్మనులు కొందరు సరిహద్దుదాటి ఇండియాలోనికివచ్చి, తిరిగి తమ దేశాన్ని ఆక్రమించి సక్రమపాలన నెలకొల్పమని మిత్ర-రాజ్యాలను వేడుకొంటున్నారని, ఒక అమెరికా యుద్ధ విలేఖరి ఆ ప్రాంతాలు సంచారం చేసివచ్చిన పిదప, తన పత్రికకు వ్రాసెను.

భారతీయ భూస్వాములకు జపాను అధికారులు రక్షణ యివ్వ నిరాకరించిరి. అసలు రక్షించుటకు వారికి సమర్థత చాలదు. బర్మాలో అరాచకం ప్రబలియుందని, ఎన్నో వివరాలు, ఆవచ్చిన బర్మనులు తెలిపిరి

### "ఇంగ్లీషు నోట్లు."

జపాను పాలకులు తామాక్రమించిన చీనాలో చేస్తున్నట్లే చేస్తున్నారు. రైలురోడ్లు, తీరప్రదేశం, మున్నగు ముఖ్య భాగాలలో మాత్రం పోలీసులుంటారు. లోభాగాలు ఎవరి బలం కొద్దివారు దోచుకుంటారు.

ఇంకోదోపిడి పద్ధతి ఏమంటే, నాణెముల విలువ తగ్గించుట రూపాయికి 100 సెంట్లుగా భాగించిరి. వెండి అణాలు తీసుకొని, వాటిస్థానే సెంటుకోనోటు చొప్పున అచ్చువేసేరు చిత్రమేమంటే ఆ నోట్లలో ఇంగ్లీషు అచ్చువేసి దిగువ జపానుభాష తర్జుమా ముద్రించేరు.

# ఇండియాలోని బంగారం వంటి పంటలు...



జర్మనీ స్వాధీనం చేసికొనిన యూరపు దేశాల్లో, జపాను స్వాధీనం చేసికొనిన చైనా ప్రాంతాల్లో పంటలను శత్రువులు కొల్లగొట్టుకొని పోతున్నారు. న్యాయంగా అనుభవించవలసిన రైతులు మలమలమాడి చచ్చిపోతున్నారు. మనకు ముఖ్యాధారము వ్యవసాయం కనుక ఇండియాలో ఇది జరగనివ్వగలమా? అనేక ఉత్పత్తి సాధనాలున్న ఇండియాపై శత్రువుల కన్ను పడింది. మనలను లోబరచుకొనెందులకు జపాను తియ్యటి మాటలను చెప్పును. ఆ మాటల విషయంలో జాగ్రత్త సుమా! జపాను వారు వచ్చిన మన స్త్రీలు, పిల్లలు మాడుటయే కనుక వారిని ఎదుర్కొనెందులకు సంయుక్తంగా మీ శక్తులను ఉపయోగించండి.

జపానువారి నెదుర్కొనుటకై
జాతీయ యుద్ధ రంగమును
తయారుచేయుడు.



PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.